శ్రీ

# గోవిందశతకము

ఇది

కొండేపూడి కొండన్న గారిచే

రచియింపఁబడెను

మొదటి కూర్పు

రాజమహేంద్రవరము.

ఎమ్. గున్నేశ్వరరావు బ్రదర్సువారిచే

శ్రీ చింతామణీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడెను.

1913

శ్రీరస్తు.

# ఓంకారేశ్వరాష్టకప్రారంభము.

శ్లో. శ్రీకంఠం త్రిపురద్రుహం త్రినయనం సింహాసనస్థం విభుం
భక్తానుగ్రహతత్పరం భవహరం బ్రహ్మాదిభిస్సేవితం
గార్గేయాది మునీశ్వరైః పరివృతం గంగాధరం శంకరం
ఓంకారేశ్వర మంబికేశ మనిశం శ్రీపార్వతీశం భజే. ౧

శ్లో. శ్రీశంభుం త్రిపురాసురాంతకరణం త్రైలోక్యనాథం శివం
గౌరీశం గజదానవారిహరణం కల్యాణరాశీకృతం
కంఠాలంకృతశేషభూషణ మజం కాత్యాయనీసేవితం
ఓంకారేశ్వర మంబికేశ మనిశం శ్రీపార్వతీశం భజే.

శ్లో. శ్రీగౌరీకరపల్లవార్చితపదం కారుణ్యపాథోనిధిం
చంద్రార్కానలలోచనం సురగురుం చంద్రార్ధచూడామణిం
వామే శైలసుతావహం శివకరం నానాప్రభాసుర ధ్వంసినం
ఓంకారేశ్వర మంబికేశ మనిశం శ్రీపార్వతీశం భజే

శ్లో. శ్రీనారాయణనేత్రపూజితపదం సిద్ధైస్సదా సేవితం
నాగాధీశవిభూషణం నతమునిం నాగాసురధ్వంసినం

నానాభీష్టవరప్రదం విషధరం నాగేంద్రహారోజ్జ్వలం
ఓంకారేశ్వర మంబికేశ మనిశం శ్రీపార్వతీశం భజే. ౪

శ్లో. నిత్యానందకరం సదాశుభకరం సత్యవ్రతాలంకృతం
దిక్పాలాష్టకపూజితాంఘ్రియుగళం దేవాసురైర్వందితం
గంగాసంగమతత్పరం గజరిపుం ఘంటారవైర్నందితం
ఓంకారేశ్వర మంబికేశ మనిశం శ్రీపార్వతీశం భజే. ౫

శ్లో. కైలాసాద్రినివాసినం మృగధరం కందర్పగర్వాపహం
భక్తానా మభయప్రదం భవహరం పద్మాప్తకోటిప్రభం
విశ్వామిత్రపరాశరాదిమునిభి ర్విద్యాధరై రర్చితం
ఓంకారేశ్వర మంబికేశ మనిశం శ్రీపార్వతీశం భజే. ౬

శ్లో. పార్వత్యాః కరపద్మసేవితపదం పంచాననైర్భాసురం
కారుణ్యామృతసాగరం గుణనిధిం కల్పావసానేస్థిరం
కంజాప్తానల సోమలోచన మజం ఖండేందుచూడోజ్జ్వలం
ఓంకారేశ్వర మంబికేశ మనిశం శ్రీపార్వతీశం భజే. ౭

శ్లో. శైలాధీశసుతాముఖాబ్జమధుపం శంఖాదినాదప్రియం
కైలాసాధిప మంబికాప్రియకరం కంజాప్తకోటిద్యుతిం
కందర్పాహవకేళితత్పర మజం కల్పద్రుమాలేస్థితం
ఓంకారేశ్వర మంబికేశ మనిశం శ్రీపార్వతీశం భజే. ౮

శ్లో. శ్రీకొండిపుడి కొండయాఖ్యరచితం ఓంకారనామాష్టకం
యేశృణ్వంతి పఠంతి భక్తిమనసా తే పుత్రపౌత్రైస్సహా
కీర్తిం యాంతి పదాశుభం జయకరం సంపత్కరం శ్రీసుఖం
విద్యాం భోగ మిహైవ రేహావిలయే గచ్ఛంతి మోక్షంధ్రువం.

# శ్రీగోవిందశతకము.

తే. గీ. శ్రీవినాయకమూర్తిని జేరి గొలచి
శారదాదేవి మనమున సంస్తుతించి
గీతశతకంబు జెప్పెద ఖ్యాతిగాను
వందనమునందగోవింద వరముకుంద. ౧

తే. గీ. వరదనారాయణాచ్యుత వాసుదేవ
పతితపావన నామాంక పరమపురుష
ఘనకృపాలోల గోపాల కనకచేల
వందనమునందగోవింద వరముకుంద. ౨

తే. గీ. కంసమర్దన వామన కమలనేత్ర
వామదేవాది గీర్వాణ వందనీయ
కోటిమన్మథ సమరూప కోమలాంగ
వందనమునందగోవింద వరముకుంద. ౩

తే. గీ. నందనందన శ్రీకృష్ణ నారసింహ
భక్తవత్సల కేశవ పద్మనాభ
గరుడవాహన మాధవ కలుషహారణ
వందనమునందగోవింద వరముకుంద.

తే. గీ. మారశతకోటి సమవేష మంజుభాష
దీనపోషక నాకును దిక్కునీవె
తప్ప కిక నన్ను బ్రోచుట గొప్పకీర్తి
వందనమునందగోవింద వరముకుంద.

తే. గీ. ద్రౌపదికి మానభంగంబు దప్పనట్లు
నక్షయంబుగ వలువలు దక్షణంబ
యిచ్చి కరుణించి బ్రోచిన యిందిరేశ
వందనమునందగోవింద వరముకుంద.

తే. గీ. రాతినాతిని గావించి ఖ్యాతిగాను
గౌతమున కిచ్చి కీర్తిని గాంచినటుల

నభయదానంబు నా కిచ్చి యాదరించు
వందనమునందగోవింద వరముకుంద ౭

తే. గీ. శరణుజొచ్చిన యలవిభీషణుని గాంచి
రాజుజేసితి తద్భ్రాతృ రాజ్యమునకు
దీనపోషక నీవంటి దేవు డెవరు
వందనమునందగోవింద వరముకుంద. ౮

తే. గీ. పిడికెడటుకులుభక్షించి బీదవిప్ర
వరున కిచ్చితి మోక్షంబు వసుధలోన
వెదకిజూచిన నీసాటివేల్పు గలడె
వందనమునందగోవింద వరముకుంద. ౯

తే. గీ. మకరితోఁ బోరి కరిరాజు మరువకుండ
మిమ్ము గొనియాడ నాతని మెచ్చి కృపను
దక్షణంబున నేలిన పక్షివాహ
వందనమునందగోవింద వరముకుంద. ౧౦

తే. గీ వేదములుగొంచు వనధిలో వేగమునను
దాగి యుండినసోమకు దర్పమణచి
మరల నవి బ్రహ్మకిచ్చిన మత్స్యరూప
వందనమునందగోవింద వరముకుంద. ౧౮

తే. గీ. అబ్ధిలోపల మందరం బమర జేసి
దేవదానవసంఘంబు ద్రిప్పునపుడు
కుధరము వహించి నిల్చినకూర్మరూప
వందనమునందగోవింద వరముకుంద. ౧౯

తే. గీ. ధరణి జాపగ జుట్టుచు దర్పమునను
బోవుచున్నట్టి కనకాక్షు బొంకమణచి
వసుధ నిల్పినసూకర వరశరీర
వందనమునందగోవింద వరముకుంద. ౨౦

తే. గీ జనకుతోడుత గలహించి శ్రమ వహించి
మిమ్ము భజియింప బ్రహ్లాదు మెచ్చి కనక

కశిపు నని లోన జంపిన కంజనాభ
వందనము నందగోవింద వరముకుంద. ౧౪

తే. గీ. అదితిగర్భమునందున నవతరించి
బలిని పాదముచేతను భంగపరచి
నాక మింద్రున కిచ్చినలోకనాథ
వందనము నందగోవింద వరముకుంద. ౧౫

తే. గీ. కార్తవీర్యుని బాహుల గర్వ మణచి
యిరువదొకమారు నృపులను నేర్పి చంపి
ధరణి గస్యపు కిచ్చిన పరశురామ
వందనము నందగోవింద వరముకుంద. ౧౬

తే. గీ. పంక్తికంఠరు బరిమార్చి పంతమునను
తోడనే నీవు జానకితోడ గూడి
రాజ్య మేలిన శ్రీరఘురామచంద్ర
వందనము నందగోవింద వరముకుంద. ౧౭

తే. గీ. రోహిణేయుండ వగుచు ధరాతలమున
ధేనుకాసుర ముష్టిక దితిజవరుల
రణములో జంపు శ్రీబలరామమూర్తి
వందనమునందగోవింద వరముకుంద. ౧౮

తే. గీ. హరుడు త్రిపురాసురుల గెల్చుతరిని నీవు
సురలు సంతోష మందుచు జూచుచుండ
బురవిరోధికి దోడైన బుద్ధరూప
వందనమునందగోవింద వరముకుంద. ౧౯

తే. గీ. అశ్వరత్నము నెక్కి యుగాంతమునను
ధర్మమార్గంబు నిల్పియు ధరణి గల్గు
ఖలుల వధియించినట్టి శ్రీకల్కిరూప
వందనమునందగోవింద వరముకుంద. ౨౦

తే. గీ. ఎలమి పదియారువేలపై నెంచిచూడ
నూటయెనమండ్రు సతులతో నూటిగాను

క్రీడ సల్పుచున్న శ్రీకృష్ణదేవ
వందనమునందగోవింద వరముకుంద. ౨౧

తే. గీ. ముజ్జగంబులు నీచిన్నిబొజ్జలోన
దాచికొని బాలకుండవై దగ పయోధి
లీలతో మఱ్ఱియాకుపై దేలువేల్ప
వందనమునందగోవింద వరముకుంద. ౨౨

తే. గీ. క్షీరనిధిమధ్యమునను లక్ష్మీసమేత
ముగను శేషాహిపర్యంకమున వసించి
కేళి దేలుచున్న శ్రీకృష్ణదేవ
వందనమునందగోవింద వరముకుంద. ౨౩

తే. గీ. నీలకంఠునిచాపంబు లీల ద్రుంచి
జానకిని నీవు పెండ్లియై జనులు పొగడ
రామునిబలంబు గైకొన్న రామచంద్ర
వందనమునందగోవింద వరముకుంద. ౨౪

తే. గీ. జననియానతి గైకొని వనము జొచ్చి
సీత నెడబాసి సుగ్రీవుచెలిమి చేసి
వాలి నవలీల ద్రుంచిన వాసుదేవ
వందనమునందగోవింద వరముకుంద. ౧౭

తే. గీ. తండ్రితోడుత వైరంబు దాల్చి నిన్ను
భజన జేసిన ప్రహ్లాదు భక్తి మెచ్చి
ముక్తి నొసగవె నను బ్రోవు భక్తవరద
వందనమునందగోవింద వరముకుంద ౧౮

తే. గీ. నీదుమాహాత్మ్య మెరుగక నేను జేయు
స్తుతియు నీకును దగదని తోచెనేని
విధిముఖామర నుతులన్ని విఫలమగును
వందనమునందగోవింద వరముకుంద ౧౯

తే. గీ. కుక్షి పదునాల్గుభువనముల్ కుదురుపరచి
పాలనము జేయుచున్నట్టిప్రభుడ వెట్లు

యొడిగియుంటివి దేవకియుదరమునను
వందనమునందగోవింద వరముకుంద. ౨౮

తే. గీ. వాసవుం డల్కతో రాళ్ల వాన గురియ
గోపకుల గోవులను గాచుకొరకు నీవు
యెలమి గోవర్ధనంబును నెత్తితౌర
వందనమునందగోవింద వరముకుంద. ౨౯

తే. గీ. దుర్భరంబైన బాణంబు దొలగుకొరకు
గర్భవతి యైనయభిమన్యుకాంత వేడ
నిర్భయత్వ మొసంగితి వర్భకునకు
వందనమునందగోవింద వరముకుంద. ౩౦

తే. గీ. మడుగులో జొచ్చి కాళీయుమస్తకములు
జరియునట్లుగ నృత్యంబు సల్పునీదు
చరణయుగ్మంబు వదలక స్మరణజేతు
వందనమునందగోవింద వరముకుంద. ౩౧

తే. గీ. కరుణ నామాన మిప్పుడు గావు మనుచు
ద్రౌపదీసతి వేడంగ దక్షిణంబ
యక్షయంబంచు నిచ్చితి వంశుకములు
వందనమునందగోవింద వరముకుంద. ౩౨

తే. గీ. మకరి చేజిక్కి కరిరాజు మదిని వేడ
సత్వరంబుగ మకరిని సంహరించి
కరినిగాచినరీతి నన్ గారవింపు
వందనమునందగోవింద వరముకుంద. ౩౩

తే. గీ. అంగనామణిపసుపున నవనిసురుడు
అటుకులను చీరకొంగున నమరముడిచి
తెచ్చియిచ్చిన సంపద లిచ్చినావు
వందనమునందగోవింద వరముకుంద. ౩౪

తే. గీ. నందు మందిరమందు నీ వందమొంద
నందియలు గజ్జెలున్ మ్రోత గ్రందుకొనగ

చిందులను ద్రొక్కి యాడు గోవిందమూర్తి
వందనము నందగోవింద వరముకుంద ౩౫

తే. గీ. అశ్వమేధంబు జేసిన యార్యులకును
దొరకు పదవులు మోక్షంబు దుర్లభంబు
నిన్ను భజియింప మోక్షంబు నిశ్చయంబు
వందనము నందగోవింద వరముకుంద. ౩౬

తే. గీ. శౌరి నిను దలచువారికి సంతతంబు
దుష్కృతములెల్ల వేగమె తొలగిపోయి
ముదముతోడుత కైవల్య పదవిగల్గు
వందనము నందగోవింద వరముకుంద. ౩౭

తే. గీ. దానములు సద్వ్రతంబులు ధరణిగల్గు
తీర్థసేవలు వలదు నీదివ్యనామ
భజన సేయంగగల్గును బరమపదము
వందనము నందగోవింద వరముకుంద. ౩౮

తే. గీ. చరణములునొవ్వ కాశికి జనగవలదు
మునురుచలితోడ గంగను మునుగవలదు
ముదముతో నిన్ను బూజింప ముక్తిగల్గు
వందనమునందగోవింద వరముకుంద.

తే. గీ. భ్రాంతినొందక నీనామ భజనజేసి
ముక్తిగాంచంగనేక మోసపోయి
బాధపడుదురు మూర్ఖులు బోధలేక
వందనమునందగోవింద వరముకుంద. ౪౦

తే. గీ. కామదాయకమైన నీనామమహిమ
దెలియనేరని మూర్ఖులు తీర్థములకు
బరుగు లిడుదురు గ్రహచారబాధచేత
వందనమునందగోవింద వరముకుంద. ౪౧

తే. గీ. పరమపావన నీపాద పంకజములు
భక్తితోడుత బూజింతు పరమపురుష

మురవిభంజన వైకుంఠ సరసిజాక్ష
వందనమునందగోవింద వరముకుంద. ౨౧

తే. గీ. కాంచనాద్రిని దలక్రింద గలిగియుండి
జిడిపిరాళ్లను వెదకిన చెలువుగాదె
దేవ నినుబాసి యన్యుల సేవగనుట
వందనమునందగోవింద వరముకుంద. ౨౩

తే. గీ. హేమసామజ ఘోటక భూమిరజిత
ధేనుభూషణ సముదయదాన మొక్క
మాటు నీనామభజనకు సాటిరాదు
వందనమునందగోవింద వరముకుంద. ౨౨

తే. గీ. రామ నీనామ మొకమారు నీమమునను
జపము జేసినవారికి జగతియందు
మోక్ష మరచేతిదై యుండు మోదమునను
వందనమునందగోవింద వరముకుంద. ౨౪

తే. గీ. రామ నీనామమునకంటె భూమియందు
వెదకిజూచిన మంత్రంబు వేరెగలదె
మునులు నీనామమునగాదె ముక్తులైరి
వందనమునందగోవింద వరముకుంద. ౪౮

తే. గీ. నీదునామంబు మదిలోన నిశ్చయముగ
నమ్మి భజియించువారలు నరకమునెదు
మాట గలనైన వినరని సాటుమందు
వందనమునందగోవింద వరముకుంద. ౪౯

తే. గీ. ధరణిలో[redacted] ఖట్వాంగ ధరణీభుజు
పరమభక్తిని గోవింద భజనజేసి
రెండుగడియల గనె ముక్తి మెండుగాను
వందనమునందగోవింద వరముకుంద.

తే. గీ. అతిదురాత్ముడజామిళుడనెడుమనుజు
డాత్మతనయుని నారాయణాఖ్య బిలువ

ముదముతో వాని కిచ్చితి మోక్ష మీవు
వందనమునందగోవింద వరముకుంద. ౪౯

తే. గీ. బ్రహ్మహత్యాదిపాతకపంచకంబు
భక్తి నీనామభజనచే భస్మమగును
దీనికిని సాక్షి వాల్మీకిమౌనివరుడు
వందనమునందగోవింద వరముకుంద. ౫౦

తే. గీ. దాసపోషక నేను నీదాసు నగుచు
దోసె లొగ్గియు వేసితి నాసలోడ
గాచి రక్షించు మిప్పుడు ఘనముగాను
వందనమునందగోవింద వరముకుంద. ౫౧

తే. గీ. రామతారకనామ నీనామ మొక్క
మారు భజియించువారికి మగుడజన్మ
మిలను లేదని మదిలోన దలచుకొందు
వందనమునందగోవింద వరముకుంద. ౫౨

తే. గీ. పాలుమీగడ తేనియ బంచదార
పానకముకన్న మధురమై బరగునీదు
రామనామామృతంబు నే బ్రేమగొందు
వందనమునందగోవింద వరముకుంద. ౫౩

తే. గీ. రామ నీపాదభక్తి నిరంతరంబు
నాకు గలుగంగ జేయుము నలిననేత్ర
యింతియేకాని వేరొక యిచ్ఛలేదు
వందనమునందగోవింద వరముకుంద. ౫౪

తే. గీ. దేవదేవుండవగు నీదుదివ్యనామ
భజన జేయంగనేరక భ్రాంతిచేత
బీదవేల్పుల గొనియాడి బేలనైతి
వందనమునందగోవింద వరముకుంద. ౫౫

తే. గీ. నీదునామమహాత్త్వంబు నిశ్చయముగ
దెలియకను మోసపోయితి దేవ యికను

బ్రతికినన్నాళ్లు నీనామభజన జేతు
వందనమునందగోవింద వరముకుంద. ౫౬

తే. గీ. పుణ్యపురుషుల బ్రోచుట పుడమియందు
ప్రజ్ఞగా దిది నీకును యజ్ఞపురుష
పతితుడగు నన్ను బ్రోచుటే పౌరుషంబు
వందనమునందగోవింద వరముకుంద. ౫౭

తే. గీ. వినుతిసేయఁగ నే సర్వవిభుడ గాను
ధృవముగా నిన్ను బూజింప ధృవుడగాను
రిక్తుడగు నన్ను గావుము భక్తవరద
వందనమునందగోవింద వరముకుంద. ౫౮

తే. గీ. సంతతము నీదునామంబు జపముఁ జేసి
పారదోలితి నాదు పాపములనెల్ల
నన్ను రక్షించు దయతోడ నారసింహ
వందనమునందగోవింద వరముకుంద. ౫౯

తే. గీ. స్థిరముగా నిన్ను వినుతింప శివుడగాను
ముందు బూజింప నారదమునినిగాను
ఖలుడనగు నన్ను గాచుటె ఘనతనీకు
వందనమునందగోవింద వరముకుంద. ౬౦

తే. గీ. దాసపోషక బిరుదును దాల్చి ప్రబలి
యుండి నను బ్రోవకుండుట యుచితమగునె
దీనుడనుగావ నీకంటె దిక్కుగలదె
వందనమునందగోవింద వరముకుంద. ౬౧

తే. గీ. భక్తపాలక నిన్ను నాసక్తితోడ
శక్తికొలదిగ వేడెద ముక్తికొరకు
రిక్తుడను నన్ను రక్షింప యుక్తమగును
వందనమునందగోవిందవరముకుంద. ౬౨

తే. గీ. బంగరపు పూలతోడుత రంగుమీర
నిన్ను నర్చింతు నిత్యంబు నీరజాక్ష

పన్నగాధిపశయన యాపన్నవరద
వందనమునందగోవింద వరముకుంద. ౬౩

తే. గీ. అందమగు నీదుపాదారవిందయుగము
హృదయమున నిల్పి బూజింతు ముదముతోడ
వదలకను నన్ను బ్రోవుము వరము లొసగి
వందనమునందగోవింద వరముకుంద. ౬౪

తే. గీ. ధర్మ మార్జింప నాకును ధనము లేదు
తపము సేయంగ శ్రమ కేను తాళలేను
భక్తునిగ జూచి నన్నేలు భద్రముగను
వందనమునందగోవింద వరముకుంద. ౬౫

తే. గీ. సుకృతకార్యంబు లన్నియు సున్నజేసి
దుష్కృతంబులు జేసితి పుష్కరముగ
బతితపావన నన్ను బ్రోవు గతియు నీవె
వందనమునందగోవింద వరముకుంద. ౬౬

తే. గీ. బాల్యవశమున గొన్నాళ్లు భంగపడితి
యవ్వనంబున గొన్నాళ్లు రవ్వబడితి
నెట్లు నను బ్రోతువో నీవు యిందిరేశ
వందనమునందగోవింద వరముకుంద. ౭౨

తే. గీ. పుట్టినప్పటినుండియు బుణ్య మెఱుగ
బాపముల కెల్ల ఘనుడనై బ్రబలుచుంటి
దురితములు బాపి నన్ను నీదరికి జేర్చు
వందనమునందగోవింద వరముకుంద. ౭౩

తే. గీ. వ్యాసనారదముని సేవ్యదాసపోష
వాసవాదిత్యసురపూజవహ్ని తేజ
దోసె లొగ్గితి కృప జూడు వాసుదేవ
వందనమునందగోవింద వరముకుంద. ౭౪

తే. గీ. పుండరీకాక్ష నేను నీదండ జేరి
నీదునామంబు భజియింతు నిశ్చలముగ

దండధరుబాధ నాకు లేకుండజేయు
వందనమునందగోవింద వరముకుంద. ౨౦

తే. గీ. నీదు నామమహత్త్వంబు నీరజాక్ష
నీలకంఠు డెరుంగును నీదుపాద
పద్మములశక్తి గౌతమపత్ని యెరుగు
వందనమునందగోవింద వరముకుంద. ౨౧

తే. గీ. కట్టినాడను వేషముల్ గణనలేక
వరుసగా నీకు బాగున్న వరము లొసగు
బాగులేకున్న వేషముల్ బాపుభువిని
వందనమునందగోవింద వరముకుంద. ౨౨

తే. గీ. క్షీరసాగరశయన లక్ష్మీకళత్ర
రంగనాయక శ్రీరామ రఘుకులేంద్ర
రామ రఘురామ జయరామ రంగధామ
వందనమునందగోవింద వరముకుంద. ౨౩

తే. గీ. ఇతర దైవంబులను గొల్వ నింపులేక
సంతతంబును నీసేవ సల్పుచుంటి
క్షీరమున ముంచు నను లేక వారిముంచు
వందనమునందగోవింద వరముకుంద. ౭౪

తే. గీ. దేవదేవ జగన్నాథ దివ్యరూప
సాదరంబుగ నను బ్రోవు నీదుపాద
సేవకంబును వేరొకత్రోవగాన
వందనమునందగోవింద వరముకుంద. ౭౫

తే. గీ. నిన్ను గానని నయనముల్ నింద్యములును
నిన్ను బొగడని జిహ్వయు నిష్ఫలంబు
నీకు మ్రొక్కని శిరములు నీరసములు
వందనమునందగోవింద వరముకుంద. ౭౬

తే. గీ. దండధరు బాధలకు నేను తాళలేక
గట్టిగా నీదుపాదముల్ బట్టికొనుచు

శరణు జొచ్చితి నన్ను నీకరుణజూడు
వందనమునందగోవింద వరముకుంద. ౭౭

తే. గీ. శ్రీశ నినుగొల్చువారికి శీఘ్రముగను
సిరియు నాయువు సంకల్పసిద్ధియశము
గల్గి లక్ష్మియు వారింట గదలకుండు
వందనమునందగోవిందా వరముకుంద. ౭౮

తే. గీ. అపరమితమైన పాపంబు గపటమునను
జపలబుద్ధిని జేసితి జగతిలోన
బతితపావన రక్షింప గతియునీవె
వందనమునందగోవింద వరముకుంద. ౭౯

తే. గీ. పన్నగా భూమిరేణువ లెన్నవచ్చు
జుక్కగతినైన గణుతింప సులభమగును
ఏదు గుణజాల మెన్నంగ నేరరెవరు
వందనమునంధగోవింద వరముకుంద. ౮౦

తే. గీ. ఇంద్రతనయుని జంపియు నినతనూజు
బాలసము జేసి మగుడంగ భానుసుతుని
గొట్టి వాసవుతనయు చేపట్టినావు
వందనమునందగోవింద వరముకుంద. ౮౧

తే. గీ. భక్తు లందరు సేవించి ముక్తులైరి
దాసులును గొల్చి వైకుంఠవాసు లైరి
పుణ్యపురుషులు భజియించి ధన్యు లైరి
వందనమునందగోవింద వరముకుంద. ౮౨

తే. గీ. ముదిమితోడుత జాలను మూల్గికొనుచు
వ్యాధిచేతను మిక్కిలి బాధపడుచు
నున్నయెడలను నిన్నెట్లు సన్నుతింతు
వందనమునందగోవింద వరముకుంద. ౮౩

తే. గీ. చూపు శ్రీహరి నీదివ్యరూపు వేగ
జూపు దయతోడ నాదుపాపముల నీదు

ప్రాపు గోరితి నన్ను నీదాపు జేర్చు
వందనమునందగోవింద వరముకుంద. ౨౪

తే. గీ. పరసతుల జూచి ముదముతో భ్రాంతి పడుచు
మోహపడుదురు సతతంబు మూర్ఖజనులు
నిరతమును నిన్ను భజియింపనేర రెవరు
వందనమునందగోవింద వరముకుంద. ౨౫

తే. గీ. వ్యాధి గల్గియు ముప్పున బాధచేత
వేదనలు బొంది ప్రాణంబు విడుచునపుడు
నిన్ను నే నెట్లుదలతును నీరజాక్ష
వందనమునందగోవింద వరముకుంద. ౨౬

తే. గీ. పాండునందనులందున బక్షమునను
దుర్జనావళి బరిమార్చి ద్రుంచుకొరకు
పూని యర్జునిసారథియైన దేవ
వందనమునందగోవింద వరముకుంద. ౨౭

తే. గీ. కోటి మన్మథరూప నీసాటివేల్పు
త్రిభువనములందు లేదని తీవ్రముగను
సాటిబల్కుచు భజియింతు జగతియందు
వందనమునందగోవింద వరముకుంద. ౮౮

తే. గీ. అగణితములైన పాపంబు లనుదినంబు
ఖలుడనై యుండి జేసితిగాన నివ్వ
ఘములను వాపి కృపతోడ నాదరించు
వందనమునందగోవింద వరముకుంద. ౮౯

తే. గీ. గోపసుందరు లందరు కొలనులోన
బూని క్రీడింప దత్పరిధానములను
లీలను హరించియిచ్చిన బాలకృష్ణ
వందనమునందగోవింద వరముకుంద. ౯౦

తే. గీ. కష్టు నాచారశూన్యుని దుష్టమతిని
నిష్ఠ నిను గొల్వనేరక భ్రష్టుని నను

కష్టమని జూడ కిప్పుడు గావుమయ్య
వందనమునందగోవింద వరముకుంద. ౯౧

తే. గీ. అచ్యుతానందగోవింద హరిముకుంద
సచ్చిదానంద సర్వజ్ఞ సరసిజాక్ష
భక్తపాలన భయహర భవవినాశ
వందనమునందగోవింద వరముకుంద. ౯౨

తే. గీ. వేదములు గానగాలేని నీదుమహిమ
వరుస వర్ణింప నే నెంతవాడనయ్య
శక్తికొలదిగ వేడితి భక్తవరద
వందనమునందగోవింద వరముకుంద. ౯౩

తే. గీ. నీదు బాణమహత్త్వంబు నీలవర్ణ
రావణుడెరుంగు బాహుపరాక్రమంబు
శంకరునిచాప మెరుగును పంకజాక్ష
వందనమునందగోవింద వరముకుంద. ౯౪

తే. గీ. ఇంద్రియవ్యాప్తిచేత నే నింతవరకు
బుద్ధిహీనుడనై యుంటి భూమియందు
దప్పులెన్నకపోషించు దాసపోష
వందనమునందగోవింద వరముకుంద. ౯౫

తే. గీ. విశ్వ ముదయింపగా జేయు విధి యనంగ
విశ్వ మెల్లను బాలింప విష్ణు డనగ
విశ్వము హరింప శివుడన వెలయు దేవ
వందనమునందగోవింద వరముకుంద. ౯౬

తే. గీ కవితశాస్త్రంబు లేమియు గాన లేదు
బంచకావ్యములైన బఠించ లేదు
భక్తి గూర్చితిగాని నాశక్తిగాదు
వందనమునందగోవింద వరముకుంద. ౯౭

తే. గీ. కొండపుడి కొండయాఖ్యుచే గూర్చబడిన
గీతశతకంబు గైకొని ఖ్యాతిగాను

బాపములు బాపి నన్ను నీపదము జేర్చు
వందనమునందగోవింద వరముకుంద.

తే. గీ. కొండెపూడ్యన్వయుండగు కొండయాఖ్యు
చేత రచియింపబడిన యీగీతశతము
భక్తిపఠియించువారికి ముక్తి గలుగు
వందనమునందగోవింద వరముకుంద.

తే. గీ. గౌతమసగోత్రజుండను కవివరుండ
గొండయాఖ్యుండ చలమయాఖ్యుని సుతుండ
రామభక్తుండ నను బ్రోవు రామచంద్ర
వందనమునందగోవింద వరముకుంద.

సమాప్తము.

Chintamani Printing Works.—Rajahmundry

